# గాంధిజీకథలు

## మొదటిభాగము




సంపాదకురాలు

వేములశ్యామలాదేవి

సూపరింటెండెంటు

అంజనీదేవి హరిజనవసతిగృహము, బెజవాడ.



ప్రకాశకులు:

హరిజన అండు కో., బెజవాడ.

# గాంధిజీకథలు

## మొదటిభాగము.

సంపాదకురాలు:

శ్రీమతి వేముల శ్యామ

ఆనరరీ సూపరింటెండెంటు:

శ్రీ అంజనీదేవి హరిజన బాలికా వసతిగృహము

బెజవాడ.




ప్రకాశకులు:

హరిజన అంషు కంపెనీ,

బెజవాడ.

మొదటికూర్పు 1000 ప్రతులు.

1938




వెల రు. 0-3-0.

# సంపాదకీయ భూమిక .



విరామకాలములో గాంధిజీ జీవితములోని రమ్యఘట్టములను మా ఆశ్రమమునందలి హరిజన బాలికలకు ఆశ్రమ పండితులు కథలుగా చెప్పుచుండెడివారు. వానిని సేకరించి ముద్రింపవలయునని కొలఁదికాలమునుండి తలంచుచున్నను ఆశ్రమాదాయము చాల కొలఁది అగుటచే అట్టివీలు కలుగలేదు. నేడు ఆశ్రమపోషకుల సాయముచేతను హరిజన ముద్రాశాల వారి తోడ్పాటుచేతను అందలి కొన్ని కథలను రెండు భాగములుగా ప్రచురింపగలిగినందులకు సంతోసము కలుగుచున్నది.

ఈ ఆశ్రమములో జరిగిన బోధనల ఫలితముగా బాల బాలికల పఠనమునకు ఇవి చాల ఉపయోగకారులని చెప్పగలను. ఆంధ్రదేశములోని ప్రధానోపాధ్యాయులు, ఉపాధ్యాయులు విద్యాశాఖాధికారులు, వసతి గృహాధిపతులు, పిల్లల తల్లి దండ్రులు పాఠశాలల మేనేజరులు, ఇంతయేల ఆంధ్రులెల్లరు ఈ కథలను బాల బాలికలచే చదివించి వారికి మేలుచేయుదురుగాక !

శ్రీ అంజనీదేవి ఆశ్రమము
25—10—1938.

వేముల శ్యామలాదేవి
హరిజన బాలికా వసతిగృహ గౌరవ అధ్యక్షురాలు.

# విషయసూచిక.







# గాంధిజీ కథలు.

## మొదటి భాగము



### 1. గాంధిజీ పుట్టుక: తలిదండ్రులు.

గాంధిజీ నేడు ప్రపంచమునందు జీవించుచున్న రెండు వందలకోట్ల జనులలోను ఉత్తముడు. అట్టి మహాపురుషుని జీవిత కథలు తెలిసికొనుటచే మనకు పుణ్యము కలుగును. మఱియు ఆనందముగా ఉండును.

గాంధిజీ జన్మ భూమి బొంబాయి రాష్ట్రమునకు ఉత్తరముగానున్న కత్తియవాడు దేశము. అందు కొన్ని స్వదేశ సంస్థానములు కలవు. వానిలో "పోరుబందరు" అను ఒక సంస్థాన ప్రభువుకడ మన గాంధిగారి తాతయగు "ఓతాగాంధి" దివానుగా ఉండెను కాని కొన్ని కుట్రల వలన ఆ ఉద్యోగమును విడిచిపెట్టి ఓతాగాంధి "జునాఘడ్" అను మఱియొక సంస్థాన ప్రభువుయొక్క కొలువులో చేరెను ఆ ఓతాగాంధిగారికి కుమారులు ఆఱుగురు. అందు అయిదవవాని పేరు "కరంచందు గాంధి" అను రెండవ పేరు గల "కబాగాంధి". ఆఱవవాని పేరు "తులసీదాసు గాంధి"

ఈ యిరువురు అన్నతమ్ములు పోరు బందరునకు తిరిగి వచ్చి ఒకరి తరువాత మఱియొకరుగా ఆస్థానమునకు దివానులు అయిరి.

ఆ యిరువురిలో "కబాగాంధి" మన గాంధిగారికి తండ్రి.

భార్యలు ఒకరి తరువాత ఒకరు చనిపోవుచుండుటచే "కబాగాంధి"గారు నాలుగు సారులు పెండ్లి ఆడిరి. వారిలో నాలుగవ భార్య పేరు "పుత్తలీబాయి".

ఆమెకు ఒక కూతురును ముగ్గురు కుమారులునుపుట్టిరి. ఆ కుమారులలో కడపటి బిడ్డపేరు "మోహనదాసు కరంచందు గాంధి" అను పూర్తిపేరుగల మన "గాంధి మహాత్ముఁడు". ఆయన 1869 వ సంవత్సరము అక్టోబరు నెల 2వ తేదీని జన్మించెను.

గాంధిగారి తల్లిదండ్రులు ఇరువురు చాల మంచిగుణములు కలవారు. తండ్రి కబాగాంధిగారు పోరుబందరు దివాను పదవిలో మంచిపేరు పొందెను. లంచములు పుచ్చుకొనని ధర్మమూర్తి అనియు సత్యవంతుడు అనియు ఖ్యాతిని కాంచెను. మఱియు తనకు ఆశ్రయమును ఇచ్చిన సంస్థానమునందును ప్రభువునందును చాల ప్రేమకలవాఁడు. సజ్జనుడు.

తల్లిగారు పరమసాధ్వి. వ్రతములు ఉపవాసములు చేయుచు ఈశ్వర పూజచేయు భక్తురాలు. ఏనాఁడుకాని భగవంతునికి పూజచేయక అన్నమును భుజించెడిదికాదు మఱియు "విష్ణు" దేవాలయమునకు ప్రతిరోజును వెళ్లుచుండెడిది.

ఆమె ప్రతిసంవత్సరము వర్షాకాలమునందు నాలుగు నెలలు రోజునకు ఒక పూట అన్నము తినుటతో తృప్తిపడు నియమముకల "చాతుర్మాస్య వ్రతము" అను నాలుగు నెలల వ్రతమునుపూని అనుష్ఠించుచుండెడిది.

ఆమె చాలమంచిది అను పేరుకాంచుటచే పోరుబందరు సంస్థానాధిపతిగారి కుటుంబములోని స్త్రీలు ఆమెను చాలగౌరవించుచుండెడివారు మఱియు పెక్కువిషయములలో ఆమెను పిలిచి సంప్రతించుచుండెడివారు.

అట్టి ఉత్తమ దంపతులకు జన్మించిన మహాపురుషుడు ప్రపంచమునందలి పురుషులలో కెల్ల సర్వోత్తముఁడు అగుటలో ఆశ్చర్యము లేదుకదా?

## 2. చిన్ననాటి కథలు.



తండ్రిగారు పోరుబందరునుండి రాజకోటకు సంస్థానాధిపతి పనిమీఁద వెళ్లునప్పటికి గాంధిజీకి ఏడుఏండ్లు వచ్చెను.

పోరుబందరులో ఉండగనే తండ్రిగారు కుమారుని బడికి పంపిరి. కాని చదువు బాగుగా సాగలేదు. గాంధిజీ రాజకోటలో మొదట ప్రైమరీస్కూలునకు వెళ్ళి చదివెను.

తరువాత "సబర్బను" స్కూలు అను మఱియొక పాఠశాలలో చదివెను. తుదకు 12 వ ఏడు వచ్చినపిదప హైస్కూలులో ప్రవేశించెను. ఇంత చిన్నతనములోకూడ ఆయన ఎప్పుడును బొంకి యెఱుఁగడు.

చిన్నతనములో ఆయనకు "సిగ్గు" హెచ్చు. అందుచే తోడి పిల్లలతో చనవుగా తిరిగెడివాడుకాడు. వారినుండి తప్పించుకొని పోవుచుండెడివాడు.

ఇతరులతో మాట్లాడవలసివచ్చునని బడికి పరుగెత్తుకొని పోవుచుండెడివాఁడు. బడినుండి తిరిగి వెళ్ళునప్పుడుకూడ అట్లే పరుగెత్తుకొని పోవుచుండెడివాఁడు. ఏల అనఁగా ఇతరులతో కలిసినచో పరిహాసింతురను భయము ఆయనకు బాల్యములో చాల హెచ్చు.

ఆయన హైస్కూలులో ప్రవేశించిన మొదటిసంవత్సరపు పరీక్షాకాలమునందు ఒక చిత్రము జరిగెను. అది బాలురు చదివి ఆనందించి అనుసరింపవలసిన చిన్నకథ.

సంవత్సరము పొడవునను చదివిన చదువునుపరీక్షించుటకు "జెల్సు" అను పేరుగల ఆంగ్లపరీక్షాధికారి వచ్చెను.

పరీక్ష జరుగుచున్నది. చిన్న ఇంగ్లీషు మాటలను తప్పులు లేకుండ బాలురు వ్రాయగలరో వ్రాయలేరో చూడవలయునని అధికారి కొన్ని పదములను వ్రాయుటకు ఇచ్చెను.

అందు "కెటిల్" అను ఒక పదమును "గాంధి" వ్రాయవలసివచ్చెను. అతడు ఆపదముయొక్క వర్ణక్రమమును సరిగా యెఱుగడు. అందుచే తప్పు వ్రాసెను.

గాంధి తప్పువ్రాసెనని అతని క్లాసునకు చదువుచెప్పుచున్న ఉపాధ్యాయుడు చూచి తెలిసికొని ఆ తప్పును దిద్దవలయునని తలంచెను. సమీపములో పరీక్షాధికారి ఉండుటచే చెప్పుటకు వీలుకలుగలేదు. అందుచేఆయన తనబూటుకొనతో సంజ్ఞచేసి పొరుగుబాలునివ్రాతనుచూచి దానిప్రకారముతప్పును దిద్దుకొనుమని సూచించెను.

"గాంధి"జీ ఆసంజ్ఞను గుర్తించెను. కాని ఇతరుల వ్రాతలో తొంగిచూచి సరిగా వ్రాయుటమంచిది కాదని గాంధిజీ తలంచెను. అందుచే గురువుగారు చేసిన గుర్తుయొక్క అర్థమును ఎరిగియు ప్రక్కవాని వ్రాతవంక కన్నెత్తిచూడక తనకు తెలిసిన తప్పునే వ్రాసెను. ఒకరివ్రాతలో ఒకరు చూడకుండ అపువల చేయుట కొరకే ఉపాధ్యాయుడు అక్కడ కాపలాఉండగా తాను ఇతరుల వ్రాతలనుచూచి వ్రాయుట దోషమని గాంధిజీ ఉద్దేశము.

తరువాత "ప్రక్కవాని వ్రాతలో చూచిసరిగా వ్రాయుము. అనిసంజ్ఞచేసినను గ్రహింపజాలవైతివి. ఎంత తెలివితక్కువవాడవు!" అని ఉపాధ్యాయుడు గాంధిజీతో అనెను. కాని, గురువుగారు చెప్పినట్లు తాను పొరుగువాని వ్రాతలో చూడకుండుట తెలివితక్కువ అనిగాంధిజీ అంగీకరింపలేదు. తరువాతకూడ ఎప్పుడును ఇతరుల వ్రాతలను చూచి వ్రాయుపనిని అతఁడు నేర్చుకొననేలేదు!.

ఇతరుల వ్రాతలను చూచి వ్రాయుమని తనకునేర్పుటగురువుగారి తప్పుఅని గాంధిజీ తలంచెను. మరియు ఆ ఉపాధ్యాయునిలోకల మరికొన్ని దోసములను కూడ గాంధి తెలిసికొనెను. అయినను గురువుగారిని తేలికగా చూచుటను. గాంధిజీ నేర్చుకొనలేదు!.

గాంధిగారు చిన్నప్పటినుండియు పెద్దలుచేయు తప్పులను చూచియు చూడనట్లు ఉండుటను అలవఱచుకొనెను. వారిలోగల మంచిని గ్రహించెడివాఁడు. చెడును తెలిసికొని విడిచిపెట్టెడివాడు కాని, వారిని దూషించెడివాడుకాఁడు.

## 3 "గాంధి" గారిపితృభక్తి కథ.



గాంధిజీకి పుట్టుకతోనే పితృభక్తి అలవడెను. అందుచే పితృభక్తిని తెలుపుకథలు ఆయనకు చాలరుచించెడివి.

తండ్రిమాట వలన అన్ని ఐశ్వర్యములను విడనాడి 14 ఏండ్లు వనవాసము చేసిన శ్రీరామచంద్రుని చరిత్రమునందు గాంధిజీకిగల అంతులేని ప్రేమప్రపంచమెల్ల ఎరిగినదే. మాతృభక్తి, పితృభక్తిగల శ్రవణునియందు గాంధిజీకి చాల ప్రీతి. ఆ కథ యందు తండ్రియగు కబాగాంధిగారికికూడ చాలఇష్టము. అందుచే ఆయన చదువుకొనుటకు శ్రవణుని కథఒకటి కొనెను.

ఆపుస్తకము గాంధిజీ కంటబడెను. అదినాటక రూపములో ఉండెను. దానిని చాలశ్రద్ధతో చదివెను. ఆకథ గాంధిజీ హృదయమును బాగుగా ఆకర్షించెను

ఆరోజులలో గుజరాతు దేశములో కొందఱుబొమ్మలను కావడిలో ఉంచుకొని ఊళ్లవెంట తిరుగుచు వానిని ప్రజలకు చూపుచుండెడివారు. వారిబొమ్మలలో శ్రవణుని బొమ్మకూడ కలదు. తల్లిదండ్రులు పెద్దలై గ్రుడ్డివారుకాగా వారినిభక్తితో కావడి యందుఉంచుకొని యాత్రలు చేయుచుండు శ్రవణునిబొమ్మ గాంధిగారికి చాలఆనందమును కలిగించెను.

"ఈశ్రవణుని జీవితమును ఆదర్శముగా ఉంచుకొని మాతృసేవ, పితృసేవ చేయుట నీకు ధర్మము సుమీ" అని గాంధిజీ తనకు తాను చెప్పుకొని ఆశ్రవణ నాటకమును తఱచుగా చదువుచుండెడివాడు. ఆబొమ్మలవాండ్రి బొమ్మలనుకూడ తఱచుగా స్మృతికి తెచ్చుకొనుచుండెడివాడు.

శ్రీవణుఁడు చనిపోయినప్పుడు దిక్కులేని తల్లి దండ్రులు కన్నీరు ధారకట్టునట్లు ఏడ్చుచుండు ఘట్టము గాంధి గారికి చాల యిష్టము. అది చదివి ఆయనకూడ కన్నీరు విడుచుచుండెడివారు. తండ్రిగారు కొని యిచ్చిన సంగీతపు యంత్రము మీద ఆ వృద్ధ దంపతుల విషాద కరమగు కథను అప్పుడప్పుడు గాంధిజీ పాడుచుండెడివాఁడు.

## 4 గాంధిజీసత్యపరత్వము : హరిశ్చంద్రునికథ.



ఆరోజులలోనే నాటక సమాజము ఒకటి గుజరాతు దేశములో తిరుగుచు రాజకోటకు వెళ్ళి సత్యహరిశ్చంద్రుని నాటకమును ప్రదర్శించెను.

ఆ నాటకమును చూచుటకు గాంధిజీ తండ్రిగారిని సమ్మతి ఇమ్మని కోరెను. ఆయన ఒప్పుకొనెను. గాంధిజీ వెళ్ళి ఆనాటకమును చూచెను. హరిశ్చంద్రుని లోకోత్తరమగు సత్యపరత్వము గాంధిగారి మనస్సునందు బాగుగా నాటుకొని పోయెను.

సత్యమును కాపాడుట కొఱకు హరిశ్చంద్రుఁడు తనకు గల గొప్ప రాజ్యమును వదలుకొని సింహములు, పులులు, మదపుటేనుగలు గల మహారణ్యములలో ముండ్ల పొదలమధ్య కాళ్ళలో ముండ్లుగుచ్చుకొని బాధకలిగించు

చుండగా అంతఃపురమునందు హంసతూలికా తల్పములపైని పరుండు పరమ సాధ్వీయగు చంద్రమతితోను, ప్రియ పుత్రుడగు లోహితాస్యునితోను పాదములలో రక్తములు క్రమ్ముచుండ నడచివెళ్ళుటను చూచినప్పుడు గాంధిజీకి కండనీరు క్రమ్మెను. అట్లే కాశికాపురమందు చేరినతర్వాత చంద్రమతి తనయజమానుని సేవలోబాధలుపొందుట, కన్నకు మారునిపోగొట్టుకొని ఆదంపతులుశ్మశానములో చేరిదుఃఖపడు ట మొదలగుఘట్టములు చూచినప్పుడు గాంధిజీకి కన్నీరుకాల్వలు కట్టుచుండెను. తుదకు ఏదోషమును చేసి ఎరుగని భార్యను చంపవలసిన దురతిపట్టి కన్నులనీరు గార్చుచు కత్తిని ఎత్తి చంపబోవుదృశ్యము ఆయనహృదయమును నీరుచేసెను.

గొప్ప సామ్రాజ్యమునకు చక్రవర్తియగు హరిశ్చంద్రుడు కేవలము సత్యమును అనుష్ఠించుటకు పడినబాధలను తలపోసిగాంధిజీ ఏడ్చుచు కూరుచుండెను.

హరిశ్చంద్రుని నాటకమును ఇరువది ముప్పది సార్లు చూడవలయునను కోరిక గాంధిజీకి కలుగుచుండెను. కాని పెక్కుసార్లునాటకమును చూచుటకు తండ్రిగారు ఎట్లు అంగీక రింపగలరు? కాని గాంధిజీకనులముందు మాత్రము ఆనాటకదృ శ్యము తరువాత చాలకాలమువఱకు కన్నులకుగట్టినట్లు కన్పడు చునేఉండెను.మఱివందలసార్లు దానిని ఆయన తనదృష్టిపథము నకు తెచ్చుకొను చుండెడివాడు. అందరును ఏలహరిశ్చంద్రులు

కారాదు? అని పెక్కు సారులు ఆయన తలపోయుచుండెడువాడు.

## (5) గాంధిజీ పెండ్లి.



గాంధిజీ పెండ్లిని మనము "బొమ్మల పెండ్లి" అని చెప్ప వచ్చును. పెండ్లి జరుగునాటికి "పెండ్లి" అనగా ఏమియో గాంధిజీకి తెలియదు. ఆయనకు అప్పుడు పదుమూడవ ఏడు.

అంత చిన్నతనములో గాంధిజీకి ఏల పెండ్లి చేయవలసి వచ్చెననగా ఆయన తండ్రియు పెదతండ్రియు ముదుసండ్రు అయిరి. అందుచే బిడ్డల పెండ్లిండ్లు చేసి చూచుకొనవలయునని వారికి ఆతురత కలిగెను.

వారు చేయవలసిన కడపటి పెండ్లిండ్లు మూడు. ఒకటి గాంధిగారి పెదతండ్రి కుమారునిది. ఆయన వయస్సు 15 లేక 16 ఏండ్లు ఉండెను. రెండవది గాంధిగారి చిన్నన్న పెండ్లి. ఆయనకు 14 ఏండ్ల వయస్సు. మూడవ పెండ్లి గాంధిగారిది. గాంధిజీ పెద్దఅన్నగారి పెండ్లి లోగడనే జరిగినది.

హిందువుల పెండ్లిండ్లకు వ్యయములు హెచ్చు. రాబోవు పెండ్లిండ్లకొఱకు కొన్ని నెలలనుండి ప్రయత్నము చేసి నగలు, విలువగల బట్టలు, వింతవింతలగు అలంకారములు సంపాదింతురు. తఱచుగా వేలమందికి షడ్రసోపేతభోజనములు పెట్టు

చుందురు. అందులకు అనేకవిధములగు పిండివంటలను, ఊరుగాయలను, వడియములను తయారుచేయుచుందురు. మఱి యు పందిళ్లు వేయవలయును. వంటశాలలు కట్టింపవలయును. ఇన్ని విధములగు వ్యయములు చేయవలసియుండుటచే అనేక కుటుంబములు వివాహములచే ఋణములపాలయి చెడిపోవు చుండును.

ఆ రోజులలో పెండ్లి అనిన గాంధిగారికి చాల సంతసముగా ఉండెను. క్రొత్త క్రొత్త పిండివంటలు, క్రొత్తబట్టలు, అలంకారములు వచ్చునని ఆయన ఆనందపడుచుండెను. మేళములను, విందులకువచ్చు పేరంటాండ్రను, పెండ్లి పెద్దలను చూచి ఆనందపడుచుండెను.

విందులు, వినోదములు, ఊరేగింపులు, పూలమాలికలు, పేరంటాండ్రయు బాలబాలికలయు అలంకారములు చూచి ఆనందించుటయు ఆడుకొనుటకు కొంచెమించుగా సమానముగు ఈడుగల మఱియొక బాలిక వచ్చునను సంతోషమునుతప్ప ఆయనకు పెండ్లిఅనగా ఏమియో తెలియదు. అట్టి రోజులలో ఆయనకు పెండ్లి జరిగిపోయెను.

అట్టి చిన్నతనములో పెండ్లిచేయుట తప్పుఅని ఆయన ఆరోజులలో గ్రహింపలేదు. కాని పెద్దవాడయిన తరువాత అంత చిన్నతనములో పెండ్లిచేయుట చాల గొప్ప తప్పుఅని ఆయన బాగుగా తెలిసికొని తగిన ఈడు రాకమునుపు ఎవరును

బాల బాలికలకు పెండ్లిండ్లు చేయరాదని పెక్కు సారులు ప్రజలకు బోధించెను.

## (6) చెడు చెలిమి : మాంసభోజనము



హైస్కూలులో చదువు రోజులలో గాంధిజీకి ఇరువురు మిత్రులు ఉండెడివారు. ఒకడు త్వరలోనే గాంధిగారి స్నేహమును విడిచిపెట్టెను. కాని రెండవవాడు విడిచిపెట్టలేదు.

ఈ రెండవ విద్యార్థికి ఆ రోజులలో గాంధిగారిమీద మంచి పలుకుబడియుండెను. బహుశః గాంధిజీ ఆరోజులలో దానిని గుర్తింపలేదు.

ఆదినములలో మాంసాహారమును భుజింపక ఉండుటచే హిందువులు దుర్బలులై స్వరాజ్యమును కోలుపోయిరనియు మరల స్వరాజ్యమును పొందవలయునన్నచో భారతీయులు మాంసమును భుజింపక తప్పదు అనియు ఒకభావము రాజకోటలో వ్యాపించెను.

శరీరబలమును సంపాదించుటకు మాంసభోజనము చేయక తప్పదు కావున దానిని నేర్చుకొందము అని అతడు నిత్యము గాంధిజీకి బోధించుచుండెను.

అతనితో చెలిమిచేయవలదని అన్నగారు, తల్లిగారు, ధర్మపత్నియు చెప్పుచుండిరి. వీరిలో భార్యమాటను గాంధిజీ అంత ముఖ్యముగా గ్రహింపలేదు.

"భర్త సర్వస్వాతంత్రుడు" అను భావము గాంధిజీ మనస్సులో నాటుకొని యుండెను. ఈభావము తరువాతమారెను. కాని ఆ రోజులలో భార్యసలహాలను లెక్కచేయు స్థితిలో ఆయన లేడు.

అన్నగారిమాటలు, తల్లిగారిమాటలు ఆయన ఎప్పుడును గారవించుచుండును. వారు అతనితో చెలిమిచేయవలదని చెప్పుచుండిరి. అతనిలో చెడుగుణములు ఉన్నమాట నిజమే. నేను అతనిని సంస్కరించుచుంటిని. నన్ను చెడగొట్టుటకు తగినశక్తి అతనిలో లేదుఅని చెప్పుచుండుటచే అన్నగారు తల్లిగారు ఊరకుండెడివారు.

మిత్రుని మాంసబోధలు తలచుచుండెను. మొదటగాంధీకి మాంసభోజనములో ఇష్టములేదు. అతనితలిదండ్రులు మాంసభోజనము అను మాటనే విననొల్లరు. వారి వైష్ణవమతము మాంసాహారమునకు సంపూర్ణముగా వ్యతిరేకము. గుజరాతులో జైనమతవ్యాప్తి హెచ్చు. జైనులు "మాంసాహారము" అను మాటనుకూడ విననొల్లరు. అట్టివారిమధ్య పెరిగినవాడు గాంధీజీ. అతడు ఎట్లు మాంసమును తినుటకు ఒప్పుకొనును?.

తల్లి పరమసాధ్వి. వ్రతపరాయణ. ఈశ్వర సేవ ఎడ తెగక చేయు పూజ్యురాలు. గాంధిజీ మాంసమును తినెనని ఆమె విన్నచో దుఃఖించును. మఱి తండ్రిగారు జంతుహింసకు అంగీకరింపరు. "మాంసభోజనము" అను పలుకును వినుటకే సహింపని ధార్మికుఁడు.

గాంధిజీ బాల్యమునుండి సత్యనిష్ఠకలవాఁడు. కుమారుడు మాంసమును భుజించుచున్నాడని తెలిసి అడిగినచో నిజమునే చెప్పితీరును. అతనినోట అట్టిమాటను విన్నచో ఆతలి తండ్రులకు కలుగు అవమానమునకు విచారమునకు మితి ఉండదనియు ఆతఁడు ఎఱుంగును.

అయినను ఆమిత్రుడు "చూడు! మాంస భోజనముచే నేను ఎంతధైర్యవంతుడ నయితినో! నేను దొంగలను తఱిమి వేయుదును. పాములను చేతితో పట్టుకొందును. నీవలె పిఱికిపందను కాను. ఇట్టిధైర్యము బలము నాకు మాంసభోజనముచే కలిగినది. నీవుకూడ మాంసమును భుజించిబలవంతుడవు కమ్ము" అని ఎల్లప్పుడు బోధించుచుండెను. నిజముగా ఆబాలుడు గాంధిజీకంటె చాల బలిష్ఠుఁడు.

గాంధిజీ అతని పరాక్రమమునుచూచి మెచ్చుకొనెను. ఆతఁడు ఎంతదూరమైనను చిటికెలో పరువెత్తును. చాల హెచ్చుదూరము దూకును. ఎన్ని దెబ్బలు కొట్టినను ఆతఁడు సహింపగలఁడు. తానో మృదుశరీరము కలవాఁడు. కష్టము

లను సహింపజాలఁడు. అందుచే మాంసమును భుజించి అట్టి బలమును సంపాదింపనెంచెను. కాని ఆమాంసభోజనము రహస్యముగా జరుగవలయును. తలిదండ్రులకు తెలియకుండ అప్పుడప్పుడు మాంసమును తినుట సత్యమును తప్పుటకాదని ఆరోజులలో "గాంధిజీ" నమ్మెను.

దొంగతనముగా మిత్రునితోకూడి నది యొడ్డునకు వెళ్ళెను. వారిరువురు చాల రహస్యమగు స్థలమున ఎవరికిని కనఁబడకుండ కూర్చుండిరి. కొంచెము మాంసమును రుచి చూచెను. అది ఎంతమాత్రమును అతనికి ఇష్టముగాలేదు. మాంసము బిఱుసుగా తోలువలె ఉండి తినుటకు వెగటుగా ఉండుటచే విడిచిపెట్టెను.

ఇంటికి వెళ్ళెను. రాత్రి నిద్రపట్టలేదు. కడుపులో మేక "బే! బే!" అనిఅఱచుచున్నట్లుండెను. కలవరపడి లేచికూర్చుండి మరల పరుండుచుండెను. కాని మాంసముతినుట ధర్మము కదా? అని తనలోతాను బుద్ధి తెచ్చుకొని మరల పరుండు చుండెను.

ఆరాత్రి గడచినది. ఇఁక మాంసము తినరాదని తోచుచుండెను. కాని మిత్రుఁడు ఒకపాటున విడుచువాఁడు కాఁడు. ఒక ఏకాంతస్థలమున ఒక భవనము ఒంటరిగా ఉండెను. అచ్చటకి గాంధిజీని తీసికొనివెళ్ళి మాంసము కలిసిన వంటకములను తయారుచేసి పెట్టుచుండెను. క్రమక్రమముగా

మేకలఱపులమాటమఱచి తినుటకు మఱిగెను. ఇట్లు ఒక సంవత్సర కాలములో అయిదాఱుసారులు భుజించెను. గాంధిజీ చాటుగ మాంసమును భుజించు రోజులలో ఇంటిదగ్గఱ తల్లిగారు వడ్డించు అన్నమును తినలేక పోవుచుండెను. ఆమె ఏల అన్నమును తినజాలకుంటివని అడుగుచుండెడిది. ఏమి చెప్పగలఁడు?. "నేడు ఒంటిలో బాగుగా లేదు. తిన్నతిండి అఱుగలేదు" అను ఇట్టి దొంగమాటలు చెప్పవలసి వచ్చుచుండెను. నిజము చెప్పినచో తల్లిగారికి హృదయము తఱుగుకొని పోవునని గాంధిజీ యెఱుగును. దీనినంతటిని ఆయన తన మనస్సులో చక్కగా తలపోసి ఏమిచేయవలయునా? అని చర్చించుకొనుచుండెను.

ఇట్లు తలపోయగా తలపోయగా దొంగతనముగా మాంసమునుతిని తల్లిదండ్రుల కనులుకప్పుట పాపము అని ఆయనకు బోధపడెను. అందుచే ఒకనాడు మాంసమును తినరాదని నిశ్చయించుకొని మిత్రునితో తన నిశ్చయమును చెప్పిదానిని మానివేసెను.

## (7) గాంధిజీ పొగత్రావుట.



గాంధిజీయు, అతని చిన్నన్నయు మాంసమును అయిదాఱుసారులు తిన్నారనుమాటను తలితండ్రులు ఎఱుఁగరు.

అట్టి రహస్యదోషములలో గాంధిజీ పొగత్రాగుట ఘట్టముఒకటి. బంధువులకుర్రవాడు ఒకడును గాంధిజీయు కొంచెమించుమించుగా గాంధిజీ వివాహపు రోజులలో చుట్టలను కాల్చుటకు అలవడిరి. ఒకసారి అలవడిన తరువాత అవ్యసనము హెచ్చుఆయెను. చుట్టలుకొనుటకు డబ్బులేదు. అందుచే గాంధిజీ పినతండ్రి త్రాగి పారవేసిన సిగరెట్టు ముక్కలను ఆబాలురు ఇరువురు కాల్చుచుండిరి.

ఆకాల్చివేసిన ముక్కలు ఎల్లప్పుడును దొరకకుండెను. అందుచే ఇంటి నౌకరుల సొంతసొమ్ములోనుండి డబ్బును దొంగిలించి కొంతకాలము వారు బీడీలు కాల్చుచుండిరి.

కాని దొంగడబ్బు మాత్రము ఎప్పుడును దొరకుచుండునా? మఱి దారిఏమి? సార, పొట్ల మొదలగు తీగెల ఎండుముక్కలను సంపాదించి అప్పుడప్పుడు పొగత్రాగుటకు అలవడిరి. కాని ఆ ఎండుతీగెలముక్కలూ అన్నికాలములలో దొరకవుకదా?.

తాము స్వతంత్రులము కాకపోవుటచే చుట్టలు త్రాగుటకు ధనము లేకపోయెనుకదా? అని యిరువురును విసుగుచెంది ఆత్మహత్యను చేసికొననెంచి ఆగ్రామపు సమీపములో ఉన్న అడవికిపోయి ఉమ్మెత్తగింజలను తెచ్చి శ్రీ కేదారేశ్వరుని ఆలయమునకువెళ్ళి దీపారాధనచేసి పర

మేశ్వరునకు మ్రొక్కి ఇరువురు చెఱి రెండు మూడు గింజ లును తినిరి.

ఇంతలో వారికి ప్రాణములమీద తీపికలిగెను. "ప్రాణములు వెంటనే పోవేమో! పోవనిచో లాభమేమి? పోనిండు పరాధీనముగా అయినను ఏల బ్రతుకరాదు" అను ఆలోచన కలిగి బ్రతుకుటకు నిశ్చయించుకొని శ్రీరామచంద్రుని సన్నిధి కేగి తమను మన్నింపుడని ఆదేవుని ప్రార్థించి ఆత్మహత్యను చేసికొను భావమును విడిచిపెట్టిరి.

చుట్టలు, బీడీలు, సిగరెట్లు త్రావుట చాల అనాగరికము అనియు చెప్పరాని రోతపని అనియు గాంధిజీ పెద్దవాడయిన తరువాత గ్రహించెను. మఱియు "ఆత్మహత్య" చేసికొనుటెంత కష్టమో అది ఎట్టిపాపకార్యమో కూడ గాంధింజీ గ్రహింపగలిగెను.

## (8) గాంధిజీ దొంగతనము.



గాంధిజీకి ఇప్పుడు సుమారు పదునైదేండ్ల వయస్సు వచ్చెను. ఆయన చిన్నన్నగారికి 16 ఏండ్లకు కొంచెము పైబడినవయస్సు వచ్చెను.

ఇట్టిరోజులలో గాంధిజీ మఱియొక గొప్పనేరమును చేసెను. అది ఏమిఅనగా దొంగతనము.

మొదటినుండియు సత్యవంతుడు అగు గాంధిజీ ఇట్టి దొంగతనము చేయుటకు ఎట్లు పాల్పడెనో మనము కొంచెము తెలిసికొనవలసియున్నది.

చిన్నన్నగారుకూడ గాంధిజీతోపాటు దొంగతనముగా మాంసమును తినుటకు ఆరంభించెనని మనము ఎఱుగుదుము. బహుశః ఆమాంసభోజనములకొఱకు చేసిన అప్పుల వలననో మఱి యేకారణముననోకాని చిన్నన్నగారికి ఇరువదియైదు రూపాయల ఋణముఆయెను.

అప్పు అయినదని తలిదండ్రులకు తెలియగూడదు. అంత మొత్తమును ఎట్లు సంపాదించి వారు ఋణమును తీర్ప గలరు? ఆ ఋణమును తీర్చుట ఎట్లాఅను విచారము ఆ యన్న తమ్ములను చాల బాధింపఁదొడఁగెను. ఎంతవిచారించినను న్యాయముగా ఋణమును తీర్చుదారి కన్పడలేదు.

దారులు వెదుకగా వెదుకగా చిన్నన్న చేతులమీద ఉన్న గట్టి బంగారు మురుగులోనుండి ఒకముక్కను తెగగొట్టి అమ్మి తీర్చుట ఒకటేదారి అని వారికి తోచెను.

ఇరువురు అన్నతమ్ములును కలిసివెళ్లి ఒక్కతులము బంగారమును చిన్నన్న మురుగునుండి తెగగొట్టి అమ్మి ఆ ఇరువదియైదురూపాయల ఋణమును తీర్చిరి.

ఋణము తీరినది. కాని గాంధిజీ హృదయములో "తప్పుపనిచేసితిని" అను తలంపు కలిగి అంతకంతకు హెచ్చి చాల బాధపెట్టుటకు ఆరంభించెను. అందుచే ఇంకముందు ఇట్టి దొంగతనమును ఎన్నడును చేయనని మనస్సులో నిశ్చయించుకొనెను.

కాని, గాంధిజీకి అంతటితో మనస్సులో శాంతి చిక్క లేదు. ముందు అట్టి నేరమును చేయకుండును గాక! మరి చేసిన నేరముమాట!. తండ్రిగారికి చెప్పక బంగారుమురుగులో నుండి ఒకతులము బంగారమును కత్తిరించి అమ్ముట దొంగ తనముకాదా? అని తలచినకొలంది ఆయన హృదయము తరుగుకొని పోవుచుండెను. తుట్టతుదకు గాంధిజీ తండ్రిగారికి చెప్పినగాని పాపము శాంతింపదని నిశ్చయించుకొనెను. స్వయముగా వెళ్ళి చెప్పుటకు భయము. ఆయన కొట్టుననియా? కాదు. తండ్రిగారు గాంధిజీ అన్నతమ్ములలో ఎవరిని పూర్వము కొట్టియుండలేదు. మరి భయమేల అనగా ఆ మాటను విన్నచో తండ్రిగారికి చాల విచారము కలుగు ననియే. తుట్టతుదకు గాంధిజీ జరిగిన విషయమును ఒక కాగి

తపుముక్క మీద వ్రాసి తానే తీసికొని వెళ్లి తండ్రిగారికి ఇచ్చి ఆయనకు ఎదురుగా కూరుచుండి ఆయన వంక చూచుచుండెను.

తండ్రిగారు ఆచీటీని చదివి ముత్యములంతటి కన్నీటి బొట్టులతో ఆ కాగితపు ముక్కను తడిపివేయుచుండెను. గాంధిజీ అదృశ్యమును చక్కగా చూచుచు తానుకూడ బొటబొట కన్నులనుండి ధారగా కన్నీటిని కార్చదొడగెను.

పిదప తండ్రి ఒక్కనిముసము కన్నులు మూసికొని ఆలోచించెను. "ఈదొంగతనమునకు తగినశిక్షను తనకు విధింపుడు" అనిగాంధిజీ ఆచీటీలో తండ్రిగారిని కోరెను. గాంధిజీ పశ్చాత్తాపబుద్ధి తండ్రిగారి మనస్సునకు బాగుగా నచ్చి "తనతప్పును తానే తెలిసికొని పశ్చాత్తాపము చెందుచున్న కుమారునకు ఇంకను శిక్షవిధించుట అవసరమా? అని యోచించియుండునేమో?.

కన్నీటిధారల మధ్య మునిగియున్న తండ్రిగారి దుఃఖమునందు ఆపిన్నతనములో గాంధిజీకి పితృప్రేమమాత్రమే కన్పడెను. నాటిరోజులలో ఆయన అంతకంటెను హెచ్చుగా గ్రహింపలేదు.

కాని ఆదృశ్యము గాంధిగారి మనఃఫలకమునందు చక్కగా నాటుకొని పోయెను. ఆయన పెక్కుసారులు దానిని గురించి తలపోసి చూచెను.

ఆ తండ్రిగారి కన్నీటిలో గాంధిజీ "అహింసా తత్వము"ను చూచెను. ఏల అనగా అట్టి సమయములో తండ్రి ఓర్చుకొని యుండుట చాల ఆశ్చర్యకరమగు విషయము. గాంధిజీని కోపపడియుండెడివాడు. లేదా తిట్టియుండెడివాడు లేదా తలను బాదుకొని యుండెడివాడు. అట్టివాఁడు ఏల కన్నీరుకార్చి యూరకుండెను?

గాంధిజీ మీదకు పరువెత్తవలసిన ఆకోపమును తండ్రిగారు తనమీద ప్రయోగించుకొనెను. అనఁగా గాంధిజీ పశ్చాత్తాపమును చెందెను. "మరల ఇట్టి దోషమును చేయను" అని ఆచీటీలో వాగ్దానము చేసెను. అందుచే కుమారుడు చేసిన తప్పుయొక్క దోషమును తనపైని వేసికొని తండ్రి కన్నీరు కార్చెను. కన్నీటినివిడుచుట అనఁగా గాంధిజీని కోపపడుటకు మారుగా శిక్షించుటకు మారుగా తనను తానే శిక్షించుకొనుట కాదా? ఇతరులను దూషింపక వారు చేయు పాపముచే కలిగిన బాధను అనుభవించుటయే "అహింస" కదా?

## (9) గాంధిజీ మాంసనిషేధవ్రత అనుష్ఠానము.

గాంధిగారితండ్రి చనిపోయిరి. పగలోకక్రియలు యథాక్రమముగా జరిగెను. తిరువాత గాంధిజీ మెట్రిక్యులేషన్ పరీక్షలో గెలిచి "భావనగరము" అను పట్టణములోని కళాశాలలో యఫ్. ఏ. పరీక్షలో చదువుచు ఆఱునెలలుండి సెలవులు గడపుటకు రాజకోటకువెళ్ళెను. అప్పుడు "మావుజీదవే" అను తండ్రిగారి మితృడు అగు బ్రాహ్మణ

పండితుడువచ్చి గాంధిజీయు, పెద్ద అన్నగారును, తల్లిగారును ఉండగా ఇట్లు చెప్పెను:-

"బి. ఏ. పరీక్షను గెలుచుటకు ఇంకను నాలుగేండ్లు పట్టును. అప్పటికైనను తండ్రిగారివలె దివాన్‌జీ అగుటకు వీలులేదు. కాలము మాఱినది. నేడు పోటీఎక్కువ, అందుచే ఇంగ్లండు వెళ్ళి బారిష్టరు పరీక్షను గెలిచివచ్చుట మంచిది" అనెను.

కొంతచర్చ జరిగినతరువాత అన్నగారు సమ్మతించిరి. కానిగాంధిని ఇంగ్లండునకుపంపుటతల్లిగారికిఇష్టములేదు. ఏలఅనగా ఆదేశములో అతడు అనేకములగు చెడుఅలవాట్లను నేర్చుకొని పాడయిపోవచ్చును అను భయము ఆమెను బాధించుచుండెను.

అందుచే ఆమె "కబాగాంధీ" గారి కుటుంబపు మేలు కోరు "బేచరజీస్వామి" అనువారిని పిలిచిఆయన సలహాను అడిగెను.

ఆస్వాములవారి సలహా ప్రకారము "మద్యమును, మాంసమును, స్త్రీని" ముట్టను అను ప్రమాణమును గాంధిజీచే చేయించి ఆమె కుమారుని ఇంగ్లండునకు పంపుటకు ఒప్పుకొనెను.

స్టీమరులో ఉండగనే మాంసాహారమును భుజింపవలసినదను ఉపన్యాసములు ఆయన చెవికి సోకజొచ్చెను. ఆస్టీమరువారు ఇచ్చు అన్ని పదార్థములలో మాంసముఉండెడిది. అందుచే గాంధిజీ ఇంటిదగ్గరనుండి తెచ్చుకొన్న పండ్లను

పిండివంటలను తిని ఎట్లో ఆకలిని తీర్చుకొనుచు ఇంగ్లండు చేరెను.

కాని ఆదేశములో గాంధిజీకి భోజనసమస్య చాల కిష్టముగా ఉండెను. ఏహోటలునకు వెళ్ళినను మాంసము కలియని కూర దొరకకుండెను.

మిత్రుడగు డాక్టరు మెహతా మాంసమును భుజింపుమని బాధపెట్టెను. కాని గాంధిజీ ఎంతమాత్రమును చలింపలేదు. "నీవు రాజకోటలో మాంసమును తింటివనియు అది రుచికరముగనే ఉండెననియు చెప్పితివి కదా? ఇండియాలో అవసరము లేకున్నను మాంసమునుతింటివి. ఈదేశపు శీతోష్ణస్థితిగతులకు మాంసభోజనము అవసరము అయినను తినననిపట్టుపట్టుచుంటివి. ఇది ఏమితెలివి! నీవు మాంసమును తినక తప్పదు." అని గట్టిగా మెహతా చెప్పెను.

గాంధిజీ మాంసమును తినుట అవసరమే అని అంగీకరించెను. "కాని నాతల్లిగారికి చేసిన ప్రమాణమును మాత్రము తప్పజాలను" అని మాంసాహారమును ఎన్నిసారులు ఎందఱుమిత్రులు చెప్పినను భుజింపనేలేదు.

మెహతాపొగచుట్టలు, సిగరెట్లు త్రాగుచుండువాఁడు. సారాకూడ పుచ్చుకొనుచుండువాఁడు. గాంధిజీకి మాత్రము ఆరెండిటిని త్రాగవలదనియే బోధించెను. అతనికి గాంధిగారిమీదకల ప్రేమకూడ అపారము. మాంసము

తిననిచో గాంధిజీ దుర్బలుడై విదేశములలో ఆరోగ్యమును కోలుపోవుననియే అట్లు గట్టిగా పెక్కుసారులు బోధించెను. అంత ప్రేమతో చెప్పినను గాంధిజీ వ్రతభంగము అగునని మిత్రునికోరికను తిరస్కరించివైచెను. కోపముచే "మాంసాహారము విషయమై నీకు మరల బోధింపను" అని మెహతా కొన్నినాళ్లు ఊరకుండెను.

కాని, మాంసమును భుజింపనిచో గాంధిజీ చిక్కిచిక్కి శల్యావశిష్టుడై చదువుకొనుటకు పనికిరానివాడగునని భయపడి మెహతా మరల కడపటి ప్రయత్నమును చేసి చూచెను. అదేమిఅనగా గాంధిజీని నాటకమును చూచుటకు రమ్మనెను. ఇరువురును వెళ్లుటకు నిశ్చయించిరి. వెళ్లుటకుముందు ఇరువురును ఒక ఫలాహారశాలకు వెళ్లిరి. వారు కొన్ని వంటకములు వడ్డించిరి. అందు "సూప్" అనగా మాంసపుచారు ఉండెను.

అందు మాంసము ఉండెనని గాంధిగారికి అనుమానము కలిగెను. కాని మెహతాగారి ఉద్దేశము ప్రకారము "ఇందు మాంసముకలదా?" అని అడుగుట అసభ్యత. కాని అందు మాంసము కలదో లేదో తెలియకయే భుజించుట గాంధిజీకి ఇష్టములేదు.

గాంధిజీ వంటవానిని దగ్గరకు పిలిచెను. ఆ"సూపు"లో మాంసపు సారము కలదా అని ప్రశ్నింపవలయునని

ఆయన ఊహ. ఆసంగతిని మెహతా కనిపెట్టి "నీవు మా బోట్ల సమాజములో ఉండుటకు తగినవాడవు కావు. వేరొక భోజనశాలకు పొమ్ము" అని కసరి పంపివేసెను.

దగ్గఱలో ఒక ఫలాహారశాల ఉండెను. కాని దానిని మూసివేసిరి. నాటికి గాంధిజీకి భోజనము సున్న. నాటితో గాంధిజీచే మాంసమును తినిపింపవలయును అను కోరికను మెహతా విడిచిపెట్టెను. వారి మైత్రి మాత్రము చెడలేదు.

మాంసమును భుజింపకుండుటకై గాంధిజీ పడిన శ్రమ పరమేశ్వరునకు ఎఱుక. కొంతకాలము ప్రతిరోజును పది పండ్రెండు మైళ్లు నడచి చౌకగా ఉండు హోటళ్లలో రొట్టెను తినెడువాడు. తరువాత ఒక శాకాహారపు హోటలును కనిపెట్టెను. ఆ హోటలులో "శాకాహార వాదము" అను పేరుగల ఒక గ్రంథమును కొని చదివెను. అంతకు పూర్వము గాంధిజీ మాంసాహారమే మంచిది అని నమ్మి ఎప్పుడు బహిరంగముగా మాంస భోజనమును అవలంబింపగలుగుదునా అని కాలముకొఱకు నిరీక్షించుచుండెను. కాని, ఆ గ్రంథమును చదివి శాకాహారమే మంచిది అను వాదమును అంగీకరించి "శాకాహార భక్తుడు" ఆయెను.

## 11 లెక్కలు వ్రాయుట : దుర్వ్యయములను తగ్గించుట.



గాంధిజీకిగల గొప్పసుగుణములలో ప్రతి దమ్మిడీకిని లెక్కవ్రాసియుంచుట ఒకటి. ఈసద్గుణము ఆయనకు ఎంత యో మేలుచేసెను.

ఇంగ్లండునకు వెళ్ళిన మొదటి రోజులలో ఆయన నూటపబది రూపాయలు ఖర్చుచేసి ఒక సాయంకాలపు సూటును (కోటు, పంట్లము) కుట్టించెను. లండనులో విక్టోరియా హోటలులో మూడురోజులకు భోజనమునకు, బసకు నలువదియైదు రూపాయలను ఇచ్చెను. ఇంతఅధిక మగు వ్యయమును ఎంతకాలము గాంధిజీ చేయఁగలడు?

అణాకుకొన్న వార్తాపత్రిక దగ్గరనుండి ప్రతిచిన్న విషయమును ఖర్చులలోవ్రాసి దానిని చక్కగా పరిశోధించుచుండుటచే ఆయనకు ఎందెందు ఎంతడబ్బు దుబారా అగుచుండెనో తెలియుచుండెను.

తండ్రిగారు చనిపోయిరి. అన్నగారు కష్టముమీాద డబ్బు పంపుచుండిరి. అందుచే ఇంగ్లండునకు వెళ్ళిన కొలఁది రోజులలోనే దుర్వ్యయమును తగ్గించుటకు గాంధిజీపూనెను.

హోటలులలో భుజించుట చాల వ్యయహేతువని తెలిసి ఇతరుల ఇండ్లలో కొంతకాలము తక్కువ ఖర్చునకు

భుజింపవలసి వచ్చెను. కాని అదికూడ హెచ్చువ్యయమే అని అతడు కనిపెట్టెను. మఱియు ఆ ఇండ్లలో మాంసమును భుజింపని వారికి సరియగు భోజనము దొరకదు. అందుచే కొలది రోజులలో తాను చదువు కళాశాలలకు దగ్గఱగా రెండు అద్దెగదులను కుదుర్చుకొని తనకు ఇష్టములగు శాకములను కొని "స్టౌ" మీద సొంతముగా వంట చేసికొనుటకు ఆరంభించెను.

ఆయన ఇంగ్లండులో నృత్యము నేర్చుకొనవలెనని నలువదియైదు రూపాయలు ఇచ్చి ఒక నృత్యపాఠశాలలో చేరెను. ఫిడేలు అవసరమని మఱియొక నలువదియైదు రూకలిచ్చి ఫిడేలును కొని నేర్పుగురువునకు కొంతధనమిచ్చి నేర్చుకొనమొదలు పెట్టెను. ఆఱుపాఠములకు వెళ్ళినను "తాళ"ము వేయుట తెలియలేదు. వ్రాసిన ఖర్చు లెక్కలు చూచెను. అపారమగు వ్యయము అగుచుండెను. నృత్యముచేయుట, ఫిడేలు వాయించుట బారిష్టరుపరీక్షకు అక్కరలేదు. అందుచే విడిచివేసెను.

తరువాత అద్దెకు ఒకగదినిమాత్రమే ఉంచుకొని సొంతముగావంటచేసికొని ఓటుపిండిపులుసుతోను, కోకో రొట్టెలతోనుజీవింప మొదలుపెట్టెను. దానివలన నెలకు అఱువది రూపాయలు ఖర్చుతగ్గెను.

ఇతరులు నెలకు సుమారునూటఏబది లేక రెండువందలు రూపాయలు వ్యయము చేయుచుండగా తన గదికిచ్చు అద్దె

గాక నెలకు సుమారు 30 రూకలే గాంధిజీ భోజనమునకు ఖర్చు చేయుచుండెను. మొదట ఎక్కడికు వెళ్ళినను బండ్ల మీదనో, ఇతర వాహనములమీదనో వెళ్ళుచుండెడివాడు. కాని తరువాతబండ్లఖర్చును కూడతగ్గించెను.

ఇంత మితవ్యయముగా జీవించుటచే గాంధిజీ కష్టముల పాలాయెనని కొందఱు తలంపవచ్చును. సొంతవంట అగుటచే ఆయన భోజనము చాల శుచిగను రుచిగను ఉండెను. కళాశాలలకు వెళ్ళుటకు వాహనములను ఉపయోగింపక రోజును తగినంతదూరము నడిచి వెళ్ళుచుండుటచే ఇతరులకంటె దేహపటుత్వము చాల హెచ్చెను. మఱియు త్వరలో వంటనుముగించి చక్కగా చదువుకొనుచుండుటచే సకాలములో బారిష్టరు పరీక్షలో గెలిచెను.

శాకాహారసంఘములోని ప్రసంగము : గాంధిజీ బిడియము



ఇంగ్లండునకు వెళ్ళిన మొదటిరోజులలో "గాంధిజీ" శాకభోజనముకంటె మాంసభోజనము మంచిదనియే నమ్మెను. కాని తల్లిగారికి వాగ్దానము చేసియుండుటచే మాంసభోజనమును విడిచెను.

కాని అనేకగ్రంథములు పఠింపగా తరువాత గాంధిజీకి శాకభోజనమే మంచిదని తోచెను. ఏలఅనఁగా మను

జుని శరీరనిర్మాణమే "శాకభోజనము"నకు తగియుండెను. మాంసమును భుజించు పెద్దపులి, సింహము మొదలగు జంతువులకు ఇతర జంతువులను చీల్చుటకు తగిన పెద్దగోళ్ళును నోటిలో పొడవగు కోఱలునుఉండును. మనుజునకు కోఱలు కాని, గోళ్ళుకాని లేవు. అందుచేమనుజుఁడు శాకాహారిఅనుట తేటతెల్లమే.

క్రమ క్రమముగా శాకాహారమే మనుష్యులకు మంచిదను భావము గాంధిజీలోనాటి బారిష్టరు పరీక్షకు చదువుకొనుచుండు కాలములో ఇంగ్లండులో "శాకాహార సంఘము" ను ఏర్పఱచెను. ఆసంఘమునకు గాంధిజీ కార్యదర్శి ఆయెను.

అందుచే ఆసంఘములో ఇంగ్లీషునందు ఉపన్యసించుచుండవలసిన బాధ్యత ఏర్పడెను. ఒంటరిగా ఉన్నప్పుడు అధ్యక్షునితో గాంధిజీ అనేక విషయములను గుఱించి చక్కగా మాట్లాడెడివాడు. కాని నలుగురు క్రొత్తవారు చేరఁగనే నోరు మూతపడు చుండెడిది.

ఆసంఘసభలలో ఒకసారి గాంధిజీ మాట్లాడవలసి వచ్చెను. కాని, మాట్లాడ గలనను ధైర్యములేదు. అందుచే తనభావములను కాగితముమీద వ్రాసికొని వెళ్ళి చదువఁబోయెను. కాని చదువుటకుకూడ చేతగాక అధ్యక్షునకిచ్చి చదివించెను.

తరువాత ఇంగ్లాండునుండి హిందూదేశమునకు తిరిగి వచ్చునప్పుడు గాంధిజీ తన మిత్రులగు శాకాహారులకు ఒక విందును చేయనెంచి హోల్‌బరను హోటలులో భోజనవసతిని ఏర్పాటుచేసెను. అది శాకములు మాత్రమేవండు హోటలుకాదు. అయినను గాంధిజీ ఆ హోటలు యజమానునితో చెప్పి ప్రత్యేకముగా శాకముల వంటనే చేయించెను.

ఆ విందునకు వారిని పిలిచియుండుటచే తాను వారికి స్వాగతమును ఈయవలసియుండెను. అందుకొరకు నాలుగుముక్కలు ఇంగ్లీషులో చెప్పవలయును.

మాట్లాడవలయునని గాంధిజీకి చాల కుతూహలముగా ఉండెను. కాని ఉపన్యసించుటకు యథాప్రకారము నోటమాట రాలేదు. "మీరు అందఱు దయతో ఈ విందునకు వచ్చినందులకు నమస్కారములు" అని చెప్పుట దుర్ఘటమైనది.

గాంధిజీ తరువాతకూడ చాలకాలము ఈ సిగ్గును విడిచిపెట్టజాలక పోయెను. కాని, ఆఫ్రికాకు వెళ్ళినతరువాత అదిమెల్ల మెల్లగా తగ్గిపోయెను.

తన కింతసిగ్గు ఉన్నందులకు ఆ రోజులలో ఆయన పెక్కుసారులు చింతించుచుండెడివాడు. కాని, తరువాతవిచా

రించుకొని ఆ సిగ్గు తనకు మేలే కావించెనని గాంధిజీ గ్రహించెను.

ఏల అనఁగా ఆ సిగ్గుచే ఆయనకు మిత భాషిత్వము అలవడెను. అవసరముకంటె ఒక్కమాటనుకూడ హెచ్చుగా ఎన్నఁడును మాట్లాడి యెఱుఁగడు. అందుచే గాంధిజీ ఎప్పుడు తన నోటివెంటవచ్చు ప్రతిమాటను చక్కగా తూచి మాట్లాడు చుండెడివాడు. వ్యర్థమైన మాట ఒక్కటికూడ ఆయన మాటలలో ఉండెడిది కాదు.

కొందఱు గంటల తరబడి వ్యర్థములగు ప్రసంగములు చేయుచుందురు. ఆ సంభాషణలలో అనవసరములును కటువు లును నిందాగర్భితములును అగు పదములను వాడుచు ఇతరుల మనస్సులను నొప్పించుచుందురు. గాంధిజీ ఎప్పుడును ఎవ్వరినిగాని కూడనిమాటలుమాట్లాడి నొప్పించియుండలేదు. అదియునుగాక వ్రాతలలో కానిమాటలలో కాని గాంధిజీకితప్పులు దొరలెడివి కావు. అందుచే "చిత్తు" "సాఫు" అను భేదములేక ఆయన ఏదిమాట్లాడినను అది సాధారణముగా "సాఫే" అయి దిద్దుకొనవలసిన అవసరము కలిగెడిది కాదు.

మఱియు వ్యర్థ ప్రసంగములు చేయువారు తమ కాల మును ఇతరుల కాలమును హరింతురు. ఉపన్యాస వేదికలమీద గంటల తరబడి చెప్పినదేచెప్పి లేదా ఆ సమయమునకు ఉపయోగింపని విషయములు చెప్పి కాలమును వ్యర్థము

చేయుచుండు ఉపన్యాసకులు దేశములో లెక్కకు మిక్కుటముగాకలరు. కాని, గాంధిజీ ఏ ఉపన్యాసములోను అవసరము కంటెఎక్కువగా ఒక్కమాటనుకూడ మాట్లాడకు.

ఆ సిగ్గు చాలకాలము గాంధిజీకి ఉండెడిది. కాని నేఁడు ఆయనకు సిగ్గు లేదు. అందుచే నేఁడు సభ్యులకు ఆనందము కలుగునట్లు చక్కగా ఉపన్యసించుట ఆయనకు పరిపాటి అయినది!

## (12) గాంధిజీ ఇంగ్లండులో సారాయిని త్యాగకుండుట.



బారిష్టరుపరీక్షకు మూడేండ్లు చదువవలయును. ఆకాలమును పండ్రెండు "టరములు" అనగా కాలములుగా విభజించిరి.

ఒక్కొక్క "టరము"లో 24 విందులు జరుగును. అట్టి విందులలో పరీక్షలో గెలువగోరువారు కనీసము ఆఱు విందులలో భోజనము చేసితీరవలయును.

ఆ విందుభోజనములలో సారాయి, మాంసము, కొలఁదిగా కూరగాయల వంటకములు, రొట్టె ఉండును.

"విందుభోజనములలో సారాయిత్రావుట" అను విషయము మనకు హిందూదేశములో చాల ఆశ్చర్యకరముగా ఉండును. సారాయిని త్రాగుటను హిందువులు పంచమహాపాపములలో ఒకటిగా గణించిరి. అందుచే హిందువులు

సారాయి త్రాగువారిని చాల నీచముగా చూచుచుందురు. ఇది మతనిషేధము.

ఈ మతనిషేధమునుబట్టియే హిందువుల సంఘమర్యాదలుకూడ ఏర్పడినవి. హిందువులలో మర్యాదకల ఏ కులము వారుగాని దానిని అంటరు. కాని, ఇంగ్లండులో సాధారణ జనులదగ్గఱనుండి మహామంత్రులవఱకును జమీందారులు, గొప్ప ప్రభువులు, రాజులు, రాజకుమారులు మద్యమును త్రావుచుందురు.

నిజముగా మద్యమును త్రావుట హేయమే. ఏల అనగా కొన్ని సూక్ష్మజీవుల మలమూత్రములే మద్యముగా మాఱును. చెట్టునుండి అప్పుడేదింపిన తీపికల్లులో ఆల్కహాలు ఉండదు. అది పులియుటకు మొదలుపెట్టినప్పుడు ఆల్కహాలు అందు చేరును. ఆ పులియుట ఎట్లు ఏర్పడును?

కొన్ని సూక్ష్మజీవులు ఆ తీయని కల్లులో చేరి బ్రతుకుట కొఱకు దానిని భుజించి తమ మలమూత్రములను ఆ కల్లులో విడుచుచుండును. ఆ మలమూత్రముల వలననే పులియుట ఏర్పడును. అదియే "ఆల్కహాలు."

గాంధిజీ "బారిష్టరు విందు"లకు వెళ్ళుచుండెను. మొదటి సారి ఆ విందులో "సారా" ఉండునని తెలిసికొన్నప్పుడు ఆయన చాల బాధపడెను.

అధికార్లు ఇచ్చిన "సారా"ను త్రాగకుండినచో వారి కెక్కడ కోపమువచ్చునో అని ఇట్టి బారిష్టరు

పరీక్షల విందులు, "గవర్నరుల దర్బారుల విందులు" మొదలగు విందులలో పట్టపరీక్షలలో నెగ్గిన విద్యార్థులు, లాయరులు, కలెక్టరులు మంత్రులుకూడ త్రాగుటను నేర్చుకొనుచుండుటను మన దేశములో తఱచుగా చూచుచున్నాము.

కాని, గాంధిజీ అట్టివాడు కాడు. బారిష్టరు విందులలో నలుగురకు రెండు సీసాల చొప్పున సారాను ఇచ్చుచుండెడివారు. తక్కిన విద్యార్థులలో పెక్కురు ఒకరికంటె ఒకరుగా ముందునకువచ్చి గాంధిజీ జట్టులో చేరి ఆయన వంతు వచ్చిన సారాను తీసికొని త్రాగుచుండెడివారు.

ఆ విందులలో మాంసాహారముకూడ చాల హెచ్చు శాకాహారములు చాల కొలది. కాని, ఉపాధ్యాయుల కొఱకు ప్రత్యేకముగా తయారుచేసిన శాకములలోనుండి కొన్నింటిని తెప్పించుకొని గాంధిజీ వానితో తృప్తిపడుచుండెడివాడు. ఆ శాకములలో తఱచుగా కాబేజికూర, బంగాళాదుంపలకూర ఉండెడివి. వానితో రొట్టెనుకూడ ఇచ్చుచుండెడివారు. ఇట్లు ఇంగ్లండులో గాంధిజీ మద్యమును మాంసమును విడిచి తల్లిగారికి చేసిన వాగ్దానమును రక్షించుకొనెను.

## (13) గాంధిజీ ఏకపత్నీ వ్రతము.

ఏకపత్నీవ్రతము అనగా పురుషుడు అగ్నిసాక్షిగా పెండ్లిఆడిన ఒక్క భార్యతోనే కాపురముచేయుట. "పాతి

వ్రతము" అనగా "స్త్రీ" అగ్నిసాక్షిగా పెండ్లియాడిన భర్త తోనే కాపురము చేయుట. ఈరెండును హిందువులకు విధిగా ఆచరింపవలసిన ధర్మములు.

హిందువులలో ఏకపత్నీవ్రతమునకు చాల గొప్ప గౌరవము కలదు. శ్రీరామచంద్రుడు ఏకపత్నీవ్రతమును అనుష్ఠించిన మహాచక్రవర్తి. ఆయనవలె ఈ విషయమునందు అంతగౌరవమును వహించిన లోకోత్తరపురుషులు మఱియొక రిద్దఱు తప్ప లేరనియే చెప్పవచ్చును. ఆయన ఇతర స్త్రీలను కన్నెత్తియైనను చూచువాడు కాడు.

యుక్తవయస్సు వచ్చినబాలిక యుక్తవయస్సు వచ్చిన బాలునితోగాని, ఈడువచ్చిన బాలుడు ఈడువచ్చిన బాలికతోగాని తల్లి తండ్రులుకాని, ఇతర బంధువులుకాని లేని కాలములో ఒంటరిగా కలసియుండుటకు హిందూసంఘము ఎంతమాత్రము అంగీకరింపదు. అదిగొప్పతప్పు. అందుచే ఈడువచ్చినప్పటినుండి బాల బాలికలు వేఱు వేఱుగా ఉందురు.

కాని, ఇంగ్లండు మొదలగు కొన్ని పాశ్చాత్యదేశములలో వయస్సువచ్చిన బాల, బాలికలు పెండ్లికానివారు అయినచో పెద్దలు దగ్గఱ లేకపోయినను విహారములకు పోవుచుందురు. సినీమాలకు నాటకములకు పోవుచుందురు. ఆ దేశములో అది తప్పుకాదు. కాని వివాహమైన స్త్రీ పురుషులు అట్లు స్వేచ్ఛగాఉండుటకు వారి సంఘముకూడ అంగీకరింపదు.

అందుచే ఇండియానుండి గొప్పపరీక్షలలో చదువుటకు ఇంగ్లండునకు వెళ్ళిన వివాహితులగు విద్యార్థులు పెండ్లికాలేదు అనిచెప్పుకొందురు. అందుచే ఆదేశములోని వోడి యీడుగల బాలికలతో స్వేచ్ఛగా మాట్లాడుటకు విందులలోను, వినోదములలోను కాలము గడపుటకు వీలు కలుగును. అందుచే గాంధిజీకూడ ఇంగ్లండు వెళ్లిన మొదటిరోజులలో తనకుపెండ్లికాలేదు అని అసత్యమును చెప్పెను. లండనులోఉన్న ఒక వృద్ధ వితంతువు ప్రతి ఆదివారమును గాంధిజీని విందునకు పిలుచుచుండెడిది. ఆ విందుసమయములో గాంధిజీతో ఒక కన్యక చాల స్నేహముగాను చనువుగాను ఉండుచు వచ్చెను.

కాని, గాంధిజీని పెండ్లి చేసికొనవలయునను భావము ఆమెకు కలదేమో అని ఆయనకు తోచెను. ఆమెకుఅట్టి ఆశ కలిగించుటకు ఇష్టములేదు. మఱియు తల్లిగారితో "ఇతర స్త్రీని ముట్టను" అను ప్రమాణముచేసి ఉండెనుకదా? ఆ వృద్ధురాలి యింట ఒకకన్యతో పెద్దలు ఉన్నప్పుడును, లేనప్పుడును చెలిమి చేయుట ఆ వాగ్దానమును తప్పుటకాదా? ఇది అంతయు ఆలోచించుకొనెను.

అందుచే ఆయన నాలుగైదు వారములు అయిన పిమ్మట "అమ్మా! మీ ప్రేమకు నమస్కారములు నాకు వివాహమైనది. ఈ విషయమును మీతో చెప్పకుండుట నాదే తప్పు. మీ బాలికతో ఒంటరిగా మాట్లాడుటను విరమింతును. ఇదివఱకు ఆమె విషయములో నేను ధర్మమును అతిక్రమింపలేదు." అని తనను ప్రతివారము విందునకు పిలు

చుచున్న ఆ వృద్ధురాలికి ఉత్తరమువ్రాసి ఆబాలికతో చెలిమి చేయుటను మానెను.

గాంధిగారి సత్యబుద్ధికి ఆ వృద్ధురాలు చాల మెచ్చుకొనెను. అట్లు నిజమును చెప్పగలవారు చాల అరుదు. ఇట్లు గాంధిగారు తల్లిగారికి చేసిన వాగ్దానమును నెఱవేర్చినవారు అయిరి. మఱియు "ఏకపత్నీవ్రతము"ను నిలుపుకొని ధన్యులు అయిరి.

(14) గాంధిజీ ఇండియాకు తిరిగివచ్చుట : వెలి.

ఇంగ్లండులో బారిష్టరు పరీక్షలో గెలిచి హిందూదేశమునకు తిరిగివచ్చుటకు స్టీమరెక్కెను. బొంబాయి సమీపమునకు స్టీమరు వచ్చునప్పటికి సముద్రము చాల అల్లకల్లోలముగా ఉండెను. ఓడలోనివారందఱు భయముచే గడగడలాడిరి. కాని గాంధిజీ లేశమేని జంకలేదు.

బొంబాయిలో కొలదికాలము ఉండి ఇంటికి వెళ్లెను. ఆరోజులలో విదేశములకు వెళ్ళివచ్చినవారిని స్వకులమువారు వెలివేయు ఆచారము ఒకటి హిందూదేశములో అన్ని రాష్ట్రములలోను ప్రబలి ఉండెను.

అందుచే గాంధిజీని వెలివేయవలయునను సంఘము ఒకటి వారికులములో వెలువడెను. కాని "వెలివేయుటమంచిది కాదు విదేశములకు వెళ్లుటలో తప్పులేదు. ధర్మశాస్త్రములలోని వ్రాతలు చెడువ్రాతలు. వానిని అనుష్ఠింప నక్కఱలేదు" అను పక్షమువారుకూడ కొందఱుకలరు.

అయినను గాంధిజీ పెద్దన్నగారు వెలివేయవలయునను వారిని సంతోషపఱచుటకొఱకు తమ్ముని "నాసిక" అను

పుణ్యస్థలములకు తీసికొనివెళ్ళి అక్కడ ఒక పుణ్యనదియందు స్నానము చేయించెను. మఱియు రాజకోటకు తీసికొనివెళ్ళి తన కులస్థులకు పెద్ద విందుచేసెను. ఈ పనులు గాంధిజీకి సమ్మతములుకావు. కాని అన్నగారియెడగల భక్తిచే వానిని ఆచరించెను.

అయినను వెలివేయ నెంచిన వారిలో ఒక్కరుకూడ గాంధిగారి విందునకు రాలేదు. అంతేగాక గాంధిగారి యింట భుజించుటకు వెళ్ళినవారినికూడ వెలివేసిరి.

చిరకాలము విదేశములో ఉండివచ్చెనుకదా అని దగ్గఱ బంధువులు గాంధి గారికి విందుచేసినచో అట్లు విందుచేసినవారినెల్ల ఆ వెలివేయు సంఘమువారు బహిష్కరింపదొడగిరి.

తనను వెలివేసినవారి యిండ్లలో గాంధిజీ మంచినీటిని అయినను పుచ్చుకొనకుండెను. ఏలఅనగా వారు బహిరంగముగా ఈయరు. కాని, చాటుగా పుచ్చుకొనుటకు గాంధిజీకి సమ్మతముకాదు.

అట్లు తనను వెలివేసినవారి విషయములో గాంధిజీ ఎంతమాత్రమును ద్వేషమును పూనకుండుటచే క్రమక్రమముగా గాంధిజీని ప్రేమించుటకుపూనిరి. గాంధిజీ వారిపైని ద్వేషమును వహించినచో వారును ద్వేషించెడివారు. మరల కలియుట చాల దుస్తరము అయియుండెడిది.

పెద్దన్నగారు గాంధిజీసంపాదనపై పెద్ద ఆశ పెట్టుకొనెను. అతఁడు గొప్ప ఆర్జనము చేయుననియు తండ్రి తాతలవలె

గొప్ప కీర్తిని సంపాదించుననియు తలంచి ఎప్పుడు గొప్ప ప్రాక్టీసుకలవాడు అగునా అని ఉవ్విళులూరుచుండెను.

గాంధిజీ ముందు గొప్ప సంపాదనపరుడు అగునను భావముతో అన్నగారు గృహావ్యయమును హెచ్చుచేసిరి. ఇంటిలో కాఫీని టీని తయారుచేసి త్రాగుట బంధుమిత్రులకు ఇచ్చుట ప్రారంభము ఆయెను. గాంధిగారు వానికి బదులు కోకోను, ఓటుపిండిజావను తయారుచేయించి ఇచ్చుచుండెను. కాని ఇంటిలో వానిని వీనినికూడ వాడుచుండుట తెలుచుగా జరుగుచుండుటచే వ్యయము హెచ్చుచుండెను.

గాంధిగారి వేషభాషలు మారెను. కోటు, పంట్లము వేసి గాంధిగారు ఇంగ్లండునుండివచ్చిన దొరగారివలె ఉండుటకు మొదలిడెను. ఇంటిలో క్రొత్త క్రొత్త పింగాణి సామానులు విరివిగా వ్యాపించెను. ఇట్లు గృహావ్యయము చాల హెచ్చిపోయెను

ఇట్టిసందర్భములో గాంధిజీ బొంబాయిలో ప్రాక్టీసు పెట్టెను. ఇంటిఅద్దెకు పెద్దమొత్తము చెల్లింపవలసి వచ్చుచుండెను. దర్జాకొలకు ఇచ్చుచందాలు తప్పవు. బొంబాయిలో ఇట్లు శక్తికిమించిన వ్యయముఅగుచుండెను. ఉన్ననాలుగైదు నెలలలో వచ్చిన ఆదాయము చిల్లిగవ్వలేదు. కుటుంబము ధనము కలదికాదు. గాంధిజీ బారిష్టరుపరీక్ష ఖర్చులచే అప్పులపాలాయెను. అందుచే అన్నగారున్న "రాజకోట"లో ప్రాక్టీసు పెట్టి గాంధిజీ ఖర్చులను తగ్గింతునా? అని తర్కింపజొచ్చెను.

సంపూర్ణము.